25. 1958—59 లో ప్రారంభించబడిన ప్రాచ్య విద్యా మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షన్లకు గ్రాంట్లు

(ఎ) ఎయిడెడ్ (ఒక సెక్షను) — 0.010

26. ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలలో అదనపు సెక్షనులను ప్రారంభించటం (ఒక సెక్షను).... 0.020

27. ఏజెన్సీ ప్రాంతాల్లో మాధ్యమిక పాఠశాలలను ప్రారంభించడం లేక హైయర్ ఎలిమెంటరీ పాఠశాలలను మాధ్యమిక పాఠశాలలుగా మార్చడం

(ప్రభుత్వంవారివి) (ఒక పాఠశాల) — 0.090

28. ఒమరవల్లిలోని ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలకు భవనాలు .... 0.980

29. ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలలో అంబర్ చర్ఖా పథకం (2 పాఠశాలలు.) .... 0.010

30. జిల్లా విద్యాశాఖాధికార్లకు జీపుల సరఫరా (3 జీపులు) .... 0.160

31. అదనపు జిల్లా విద్యాశాఖాధికారిని నియమించటం(ఒకరు) .... 0.290

32. ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలల్లో అదనపు సెక్షనులను ప్రారంభించడం (2 సెక్షనులు) 0.160

మొత్తం 10.381

## సెకండరీ విద్య

సెకండరీ విద్యాభివృద్ధికోసం యీ జిల్లాకు రు. 1.493 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సొమ్ము క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

| వరుస సంఖ్య. | పథకం పేరు. | కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | 1956—57 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షనులు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి (2 పాఠశాలలు 9 సెక్షనులు) .... | 0.050 |
| 2. | 1957—58లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షనులు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి (8 సెక్షనులు) .... | 0.120 |
| | (బి) ఎయిడెడ్ వి (1 సెక్షను) .... | 0.010 |
| 3. | 1957—58లో హైయర్ సెకండరీ పాఠశాలల స్థాయికి మార్చబడిన ఉన్నత పాఠశాలలు. | |
| | (ఎ) స్థానిక సంస్థలవి (ఒక పాఠశాల) | 0.020 |
| 4. | ఉన్నత పాఠశాలలకు భవనాలకోసం గ్రాంట్లు | |
| | (ఎ) స్థానిక సంస్థలు (ఒక పాఠశాల) .... | 0.040 |
| | (బి) ఎయిడెడ్ వాటికి .... | 0.020 |
| 5. | హైయర్ సెకండరీ పాఠశాలలకు భవనాలు | |

(ఎ) స్థానిక సంస్థలవి (ఒకపాఠశాల) .... 0.050

6. సెకండరీపాఠశాలల్లో ఉపాధ్యాయుల జీతాలు పెంచటానికి .... 0.820

## క్రొత్త పథకాలు

7. 1958—59లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలకు, ఆదనపు సెక్షనులకు గ్రాంట్లు

(ఎ) స్థానిక సంస్థలవి .... 0.030

(బి) ఎయిడెడ్ వి .... 0.020

8. మాధ్యమిక పాఠశాలలను (ప్రభుత్వంవారివి) ఉన్నత పాఠశాలల స్థాయికి పెంచటం; సెకండరీ పాఠశాలలలో అదనపు సెక్షనులను ప్రారంభించటం .... 0.010

9. ఉన్నత పాఠశాలలకు భవనాల క్రింద గ్రాంట్లు

(ఎ) స్థానిక సంస్థలవి. ... 0.050

(బి) ఎయిడెడ్ వి .... 0.100

10. ఉన్నత పాఠశాలలకు కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్య పరికరాలకు గానుగ్రాంట్లు

(ఎ) స్థానిక సంస్థలకు .... 0.100

(బి) ఎయిడెడ్ వాటికి .... 0.050

11. **XI, XII** తరగతుల్లో చదువుకొనే విద్యార్థులకు స్కాలరు షిప్పులు. .... 0.003

మొత్తం 1.493

## యూనివర్సిటీ విద్య

ఆంధ్ర ప్రాంతంలో యూనివర్సిటీ విద్యాభివృద్ధికిగాను ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలోను రు. 34.64 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. ఈ సంవత్సరమునకుగాను ఆంధ్ర ప్రాంతానికి ప్రణాళికలో రు. 24.56 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.76 లక్ష క్రింది పథకాలకుగాను యీ జిల్లాకు కేటాయించ బడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | ప్రభుత్వ కళాశాలల్లో ప్రి–యూనివర్శిటీ కోర్సులు (1956—57 లో ప్రారంభించ బడినట్టివి.) .... | 0.10 |
| 2. | ప్రభుత్వ ఆర్ట్సు, ట్రైనింగు కళాశాలల్లో నియమింపబడిన అదనపు సిబ్బంది .... | 0.01 |
| 3. | శ్రీకాకుళంలోని ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలకు భవనాలు .... | 1.00 |
| | **క్రొత్త పథకాలు** | |
| 4. | ప్రభుత్వ కళాశాలల్లో మూడేళ్ల డిగ్రీ కోర్సును ప్రవేశ పెట్టటం. .... | 0.65 |
| | మొత్తం | 1.76 |

## ఇతర పథకాలు

క్రింద చూపిన విధంగా ఇతర పథకాలకోసం యీ జిల్లాలో రు. 0·72 లక్ష మొత్తం ఖర్చు పెట్టబడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | ఎన్. సి. సి., ఎ. సి. సి. ల విస్తృతికి ... | 0.059 |
| 2. | స్కౌటింగు, గర్ల్ గైడింగు అభివృద్ధికి .... | 0.02 |
| | **క్రొత్త పథకాలు** | |
| 3. | పంచాయితీలకు, ప్రయివేటువారికి, సహకార సంఘాలకు, గ్రామ సంఘాలకు, స్థానిక సంస్థలకు చెందిన గ్రంథాలయాలకు గ్రాంట్లు.... | 0.07 |
| 4. | ఎన్.సి.సి., యూనిట్లకు "ఏరో మాడలింగ్" మరియు "షిప్ మాడలింగ్" పరికరాలను సరఫరా చేయుటం .... | 0.01 |
| 5. | హిందీ ప్రేమీ మండలుల గ్రథాలయాలకు గ్రాంట్లు ... | 0.010 |
| 6. | యువజన సంక్షేమ కార్యకలాపాలు .... | 0·010 |
| 7. | ఎన్. సి. సి., ఏ.సి.సి. యూనిట్లలో పనిచేసే చౌకీదార్ల జీతాల సవరింపుకు. .... | 0.010 |
| | మొత్తం | 0.720 |

# వైద్యం

## మంత్రసానులకు శిక్షణ

అదనంగా మంత్రసానులకు శిక్షణ యివ్వటంకోసం ఈసంవత్సరపు ప్రణాళికలో రు. 1.26 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో 18 మంది మంత్రసానులకు రు. 0.26 లక్షవ్యయంతో శ్రీకాకుళంలోని జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో శిక్షణ యివ్వబడుతుంది.

## జిల్లా కేంద్రాలలోని ఆసుపత్రుల అభివృద్ధి

రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో రు. 13.00 లక్షల మొత్తం ఖర్చుతో అదనంగా భవనాలు నిర్మించటంద్వారాను, పరికరాలను సమకూర్చటంద్వారాను, సిబ్బందినినియమించటంద్వారాను ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా ఆసుపత్రులకు అనేకమైన అభివృద్ధిపనులు చేయబడినాయి. జిల్లా ఆసుపత్రులను అభివృద్ధి పరచటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 9.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.74 లక్ష మొత్తం శ్రీకాకుళంలోని జిల్లా ఆసుపత్రికి అభివృద్ధిపనుల నిమిత్తం వినియోగించ బడుతుంది.

## తాలూకా కేంద్రాలలోని ఆసుపత్రులకు అభివృద్ధి పనులు.

పడకల సంఖ్యను పెంచడం, అదనంగా భవనాలను నిర్మించడంద్వారా ఆంధ్ర ప్రాంతంలోని తాలూకా ఆసుపత్రులనుఅభివృద్ధి చేయుటంకోసం రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలో రు. 4.71 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. తాలూకా ఆసుపత్రుల అభివృద్ధికిగాను ఈ సంవత్సరంలో రు. 1.60 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. ఇందులో రు. 0.15 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. పడకల సంఖ్యను పెంచటం మూలంగా ఈ జిల్లాలోని తాలూకా ఆసుపత్రులలో యింతకుముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి, మరికొన్ని తాలూకా ఆసుపత్రులను ఈ సంవత్సరంలో అభివృద్ధిపరచటానికిగాను పైడబ్బు వినియోగించబడుతుంది.

## లోకల్ ఫండు ఆసుపత్రులను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం.

ఈ పథకం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.95 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.24 లక్ష యీ జిల్లాకు కేటాయించ బడింది. 1958—59లలో స్వాధీనం చేసికోబడినట్టి ఇచ్చాపురం, బొబ్బిలి దుర్గం ఆసుపత్రుల నిర్వహణకు పై డబ్బు వినియోగించబడుతుంది.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు.

దేశంలో త్వరితగతిని జనాభా పెరగటం మూలంగా దేశం యొక్క పరిమితమైన ఆదాయ మార్గాల పై అధికమైన ఒత్తిడి కలుగచేయబడుతున్నది. ఈ కారణాలవల్ల కుటుంబ నియంత్రణ, జనాభా పెరుగుదలను అరి కట్టడం అవసర మయింది. ఇందువల్ల 1957—59 సంవత్సరాలలో ఆంధ్ర ప్రాంతంలో 13, తెలంగాణా ప్రాంతంలో 7— మొత్తం 20 కుటుంబ నియంత్రణ కేంద్రాలు స్థాపించ బడినాయి. ఈ సంవత్సరంలో యింకా 15 కేంద్రాలను— 10 ఆంధ్రలోను, 5 తెలంగాణాలోను— ప్రారంభించటానికి, ఇంతకుముందు ప్రారంభించిన వాటిని కొనసాగించ టానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు 1959—60 ప్రణాళికలో రు. 0.66లక్ష కేటాయించబడింది. ఇందులో రు.0.03 లక్ష ఈ జిల్లాలో వినియోగించబడుతుంది. శ్రీకాకుళంలో ఉన్న జిల్లా ఆసుపత్రిలో ఒకకుటుంబ నియంత్రణ కేంద్రం స్థాపించబడుతుంది.

## క్షయ చికిత్సా కేంద్రాలు

రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలోను ఆంధ్ర ప్రాంతంలో 10 క్షయ చికిత్సా కేంద్రాలు నెలకొల్పబడినాయి. ఈ సంవత్సరంలో యింకా 4 కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందు ప్రారంభించిన వాటిని కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది ఇందులో రు. 0.20లక్ష మొత్తం1958—59లో శ్రీకాకుళంలోని హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో ఏర్పాటుచేయబడిన క్షయ చికిత్సా కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకం క్రింద, గ్రామీణ ప్రజల అవసరాలను తీర్చటంకోసం ప్లాని ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో యీ పథకం క్రింద రు. 15.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.50 లక్ష మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ జిల్లాలో 4 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందు ఏర్పాటు చేయబడిన కేంద్రాలను కొనసాగించటానికి పై డబ్బు వినియోగించబడుతుంది

## కుష్టురోగ నివారణ

1957—58, 1958—59 సంవత్సరాలలో ప్రారంభించబడిన 4 కుష్టు వ్యాధి నివారణ సహాయక కేంద్రాలను కొనసాగించటానికి, క్రొత్తగా మరో 2 కేంద్రాలను ప్రారంభించటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.55 లక్షల మొత్తం కేటాయించబడింది, ఇందులో రు. 0.50 లక్ష శ్రీకాకుళంలో ఒక కుష్టు వ్యాధి నివారణ కేంద్రాన్ని ఏర్పాటు చేయు టకుగాను ప్రత్యేకించబడింది.

# ప్రజారోగ్యం

## దాయీలకు శిక్షణ

గ్రామీణ ప్రాంతాలలో ఇండ్లలోనే కాన్పులు జరిగే పద్ధతిని మెరుగుపరచడానికిగాను 1956—57 సంవత్సరంలో యీ శిక్షణ పథకం ప్రారంభించబడింది, నాటు మంత్రసానులు పురుళ్లు పోయడంలో ఉత్తమ పద్ధతుల నవలంబించి తమవృత్తిని నిర్వహించడానికిగాను యీపథకం క్రింద శిక్షణ యివ్వబడుతుంది. రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలలో 1.329 మంది ఈ పథకంక్రింద శిక్షణకోసం చేర్చుకోబడ్డారు. ఈ సంవత్సరంలో ఆ పథకం కొనసాగింపబడడమే కాకుండా మరొక 720 మంది అభ్యర్థులు చేర్చుకోబడతారు. అందుకోసం రు. 0.81 లక్ష మొత్తం రాజ్య ప్రణాళికలో

కేటాయించబడింది. 60 మంది దాయీలకు శిక్షణ నిచ్చేటందుకు ఆ మొత్తంలో 5,500 రూపాయలు ఈ జిల్లాలో వినియోగించ బడితాయి.

## మలేరియా బ్యూరో విస్తరణ

మొదటి ప్రణాళికా కాలంలో స్థాపించబడిన 2 మలేరియా నివారణ యూనిట్లు 1955—57లో కొనసాగింప బడినాయి. 1957—58 లో మరో 4 యూనిట్లు ఏర్పాటుచేయడం జరిగింది. ఈ 4 యూనిట్లు 1958—59 లో కొనసాగించ బడ్డాయి. ఈ వ్యాధిరాకుండా 40 లక్షల మందికి రక్షణ చేకూర్చ టానికి ఈ యూనిట్లు ఉపకరించాయి. నేషనల్ మలేరియా నివారణ కార్యక్రమం మలేరియా నిర్మూలనా కార్యక్రమంగా 1—4—1958 నుండి మార్చ బడింది. అదనంగా స్ప్రేయింగు పరికరాలు, డి.డి.టి. ని సరఫరా చేయడం ద్వారా మలేరియా సోకని ప్రాంతాలతోసహా రాజ్యం అంతటా మందు చల్లడం తీవ్రం చేయబడుతుంది. 17 సబ్ యూనిట్లతో ప్రస్తుతం ఉన్న 4 యూనిట్లను కొనసాగించడానికి, 16 హైపో-ఎండమిక్ యూనిట్లను తెరవడానికి, ప్రజారోగ్య శాఖ రీజనల్ అసిస్టెంటు డైరక్టర్ల కార్యాలయాలను మూడింటిని నెలకొల్ప డానికి 1959—60 ప్రణాళికలో రాజ్య ప్రభుత్వం వాటాక్రింద రూ. 22.29 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. 2.71 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ప్రస్తుతం ఉన్న సబ్‌యూనిట్లను కొనసాగించ డానికి, 2 హైపో ఎండమిక్ యూనిట్లును ప్రారంభించడానికి ఈ మొత్తం వినియోగించ బడుతుంది.

## ఆరోగ్య ప్రచారం

ప్రజలకు ఆరోగ్యవిషయాలను తెలియ చెప్పేటందుకు 1957—58 లో ప్రజారోగ్యశాఖ డైరక్టరు కార్యాలయంలో ఒక కేంద్ర ఆరోగ్య ప్రచార సంస్థ స్థాపించబడింది. రెండు వ్యాన్లు కొనబడ్డాయి. ఇంతకుముందుకొన్న 11 జీపులను, అంటువ్యాధుల నివారణగురించి ప్రచారంచేయడానికి ఉపకరించే రెండు వ్యానులను నిర్వహించడం జరిగింది. 1958—59 లో ఈ పథకాన్ని కొనసాగించడానికి న్యూఢిల్లీలోని వర్కింగు గ్రూపు సమ్మతించలేదు. అయి

నప్పటికి జిల్లాలలో ప్రస్తుతంఉన్న 11 జీపులను, 4 వ్యానులను నిర్వహించ డానికి, హైదరాబాదులోని కేంద్ర ఆరోగ్య ప్రచారసంస్థను కొనసాగించ డానికి, 8 క్రొత్త వ్యానులను కొనడానికిగాను 1959—60 లో రూ. 4.15 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 0.12 లక్ష యీజిల్లాలోఉన్న ఒక జీపు, ఒక వ్యాను నిర్వహణకోసం ప్రత్యేకించబడింది.

# గ్రామీణ, పట్టణ నీటి సరఫరా

## పట్టణ నీటిసరఫరా, మురుగు పారుదల పథకాలు

స్థానికసంస్థలకు సంబంధించిన పట్టణ నీటిసరఫరా, మురుగుపారుదల పథకాలకోసం భారత ప్రభుత్వంవారు రు. 102.446 లక్షల మొత్తాన్ని (రు. *82.446 లక్షల మొత్తం కేంద్రప్రణాళికక్రింద, రు. 20.00 లక్షలమొత్తం రాజ్యప్రణాళికక్రింద) ఋణ సహాయంగా యిస్తారని ఆశించబడుతున్నది. ఇందులో రు. 41.270 లక్షల మొత్తం కార్పొరేషను పథకాలకుగాను ప్రత్యే కించబడింది. మిగత మొత్తంలో రు. 5.353 లక్షల మొత్తం క్రిందిపథకాలకు గాను యీ జిల్లాలో వినియోగించబడుతుంది.

| పథకం పేరు | | కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. సాలూరు నీటి సరఫరా పథకం | .... | 1.350 |
| 2. పార్వతీపురం నీటి సరఫరా అభివృద్ధి పనులు | .... | 4.000 |
| | మొత్తం | 5.350 |

---

*ఇందులో రు. 5.446 లక్షల మొత్తం యీ పథకానికిగాను గత సంవత్సరం కేటాయించబడిన మొత్తంలో ఖర్చు పెట్టబడకుండా మిగిలి పోయి నట్టిది.

## గ్రామ ప్రాంతాలకు నీటి సరఫరా, పారిశుధ్య సౌకర్యాలకోసం జాతీయ పథకం

గ్రామీణ ప్రజలకు మంచినీటి, పారిశుధ్య సౌకర్యాలను కలుగచేయడమే ఈ పథకం ఉద్దేశం. ఆంధ్ర ప్రాంతానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 16.34 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ కార్యక్రమాన్ని తీవ్రతరం చేయటంకోసం పై కేటాయింపులో రు. 3.86 లక్షల మొత్తం శ్రీకాకుళం యూనిట్టుకు కేటాయించబడింది. ఈ యూనిట్టు 958—59లో ప్రారంభించ బడింది.

# గృహ నిర్మాణం

## పట్టణాలలో గృహ వసతి

### సహకార సంఘాలు

పట్టణ గృహ నిర్మాణ సహకార సంఘాల సభ్యులకు ఇండ్లను నిర్మించు కోవడానికి దీర్ఘకాలిక ఋణాల నివ్వడంద్వారా పట్టణ ప్రాంతాలలోని ఇండ్ల కొరతను తీర్చడానికి ఉద్దేశించ బడింది. ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతంలో క్రొత్తగా 8‹0 ఇండ్లను నిర్మించు కోవడానికి ఋణాల క్రింద ఇచ్చేటందుకు రు. 20.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.60 లక్ష మొత్తం యీ జిల్లాలో 10 ఇళ్ళ నిర్మాణానికిగాను ప్రత్యేకించ బడింది.

# కార్మికులు - కార్మిక సంక్షేమం

## ఉద్యోగ సాధక కేంద్రం స్థాపన

శ్రీకాకుళంలో జిల్లా ఉద్యోగ సాధక కేంద్రమొకటి 1956—57 లో స్థాపించబడింది. దీనితో ఆంధ్ర ప్రాంతమంతటినీ ఉద్యోగ సాధక వ్యవస్థల యొక్క కార్యక్రమం క్రిందకు తీసుక రావడంజరిగింది. ఆంధ్రలోని ప్రతి జిల్లాకు ఒక్కొక్క ఉద్యోగ సాధక కేంద్రం ఏర్పడింది. రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల్లో పై ఉద్యోగ సాధక కేంద్రం కొనసాగింపుకు రు. 0.27 లక్ష ఖర్చుపెట్టబడింది. రు. 0.10 లక్ష వ్యయంతో యీ కేంద్రాన్ని 1959—60 లో కూడ కొనసాగించడానికి ప్రతిపాదింపబండింది.

ఈ కేంద్రం కొనసాగింపుకుగాను రాజ్యప్రభుత్వం భరించాల్సిన 40 వంతుల ఖర్చు క్రింద రు. 0.04 లక్ష 1959—60 ప్రణాళికలో కేటాయించబడింది.

## ఉద్యోగ సమాచార సేకరణ

ఈ పథకం యొక్క లక్ష్యాలేవంటే:

1. ఏ రకం ఉద్యోగులు కొరతగా ఉన్నారన్నవిషయాన్ని ఎంప్లాయి మెంటు అధికారులు ఖచ్చితంగా నిర్ణయించడం కోసం ఇంకా ఎక్కువ వివరాలను వారికిఅంద చేయడం.

2. విద్యాభ్యాసం పూర్తిచేసిన వారికి, ఉద్యోగాన్వేషణలో ఉన్న వారికి ఉద్యోగాల విషయంలోను. ఉద్యోగ అవకాశాల విషయంలోను సలహానిచ్చేటందుకు సమాచారాన్ని లభ్యం చేయడం.

3. ఉద్యోగ సాధక కేంద్రం యొక్క పరిధిలో ఉండే ప్రాంతంలో గాని, నిర్ణీత ఎంప్లాయిమెంటు మార్కెట్లుగా పరిగణింప బడే ఇతర ప్రాంతాలలో గాని ఉద్యోగ నియమావకాశాలలో వచ్చే మార్పులు గమనించడానికి తగిన విధానాన్ని రూపొందించడం.

4. ప్రతి పరిశ్రమ, వృత్తులలో ఉండే ఉద్యోగ, నిరుద్యోగాల పోకడలను ముందుగా సూచించడం.

ఈ పథకం, 1957-58లో 5 ప్రధాన ఉద్యోగ సాధక కేంద్రాల్లో అమలు పరచబడింది ఆ కేంద్రాలేవంటే హైదరాబాదు, వరంగల్లు, విశాఖపట్టణం, విజయవాడ, కర్నూలు. వీటి కేంద్రయూనిట్టు హైదరాబాదులోఉన్న నేషనల్ ఎంప్లాయిమెంటు సర్వీసు డైరెక్టరేటులో ఏర్పాటు చేయబడింది. 1958-59లో ఈ పథకం, కాకినాడ, గుంటూరు, నిజామాబాదులలోని జిల్లా ఉద్యోగ సాధక కేంద్రాలకు విస్తరింప చేయబడింది. 1959-60లో విశాఖపట్టణం, విజయవాడ, కాకినాడ, గుంటూరు, వరంగల్లులలోని ప్రైవేటు రంగాన్ని పరిశీలించడానికి తలపెట్టబడింది. ఇందుకోసం, పైన తెలుప బడిన ఎక్స్ఛేంజిలలో అదనపు సిబ్బందిని నియమించడం, డైరెక్టరేటులోని సెంట్రల్ యూనిట్టును ఒక సీనియరు అధికారి ఆజ్మాయిషి క్రింద ఉంచడంద్వారా సెంట్రల్ యూనిట్టును

ప్రతిష్ఠం చేయటం జరుగుతుంది. మిగిలిన అన్ని కేంద్రాలలోకూడ సిబ్బందిని పెంచడానికి ఉద్దేశింప బడింది. ఈ కేంద్రాలన్నిటిలోను ఒకొక్క గుమస్తాను అదనంగా నియమిస్తారు. ఈ పథకానికి అయ్యేఖర్చులో కేంద్ర ప్రభుత్వం వారు భరించే రు. 0.47 లక్షకుతోడుగా రాజ్య ప్రభుత్వ వాటా క్రింద 1959—60 ప్రణాళికలో రు. 0.31 లక్ష మొత్తం కేటాయించ బడింది. మొత్తం రు. 0.78 లక్షలోను రు. 0.012 లక్ష మొత్తం ఈ జిల్లాలోని కార్యక్రమం క్రింద వినియోగించ బడుతుంది.

# వెనుకబడినతరగతులు, షెడ్యూల్డుకులాలసంక్షేమం.

## షెడ్యూల్డు కులాలు-షెడ్యూల్డు కులాల విద్యార్థులకు స్కాలరుషిప్పులు

ఈ పథకంక్రింద హరిజన విద్యార్థులకు ఇతర అర్హమైన కులాల విద్యార్థులకు అన్ని తరగతులలోను స్కాలరు షిప్పులు మంజూరు చేయబడుతున్నాయి. తల్లి దండ్రుల ఆదాయం ఉన్నత పాఠశాల విద్యార్థుల విషయంలో రు. 1,500లకు, కళాశాల విద్యార్థుల విషయంలో రు. 1,800లకు మించకుండా ఉంటే రుసుం చెల్లించనవసరంలేకుండా మాఫీ చేయబడుతుంది. 1959—60 లో ఇదివరకు మంజూరుచేసిన స్కాలరుషిప్పులను కొనసాగించడమే కాకుండా సుమారు 1,600 అదనపు స్కాలరు షిప్పులను మంజూరుచేయడానికిగాను రు. 4.90 లక్షల మొత్తం కేటాయించబడింది. స్కాలరుషిప్పులు ఈ జిల్లాలోని అర్హులైన విద్యార్థులకుకూడా ఇవ్వబడతాయి.

## షెడ్యూల్డు కులాలవారికి సబ్సిడైజుడు హాస్టళ్ళు

ఆంధ్ర ప్రాంతంలో ప్రభుత్వ సహాయంతో నడుపబడే హాస్టళ్లు 438 ఉన్నాయి. విద్యా సంవత్సరానికి విద్యార్థికి రు. 150 చొప్పున బోర్డింగు గ్రాంట్లు వెనుకబడిన తరగతుల, హరిజనుల విద్యార్థులకు ఏటా ఇవ్వబడుతున్నాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో 670 అదనపు బోర్డింగు గ్రాంట్లు మంజూరు చేయ్యడానికి రు. 1.00 లక్ష మొత్తం కేటాయించ బడింది. బోర్డింగు గ్రాంట్లు ఈ జిల్లాలోని హాస్టళ్లకు కూడ ఇవ్వబడతాయి.

## షెడ్యూల్డు కులాలవారికి ప్రభుత్వ హాస్టళ్లు.

ఈ జిల్లాలోని మందస, పార్వతీపురం, బారువలలో ఉన్న హాస్టళ్ళు 1959-60లో రు. 0.180 లక్ష వ్యయంతో నిర్వహించ బడతాయి.

## పాఠశాలల, హాస్టళ్ళ భవనాల నిర్మాణం, మరమ్మతులు.

ఆంధ్ర ప్రాంతంలోని సాంఘిక సంక్షేమ పాఠశాలలు, సాంఘిక సంక్షేమ శాఖ అజ్మాయిషీ క్రింద గ్రాంటు సబ్సిడీ పొందే హాస్టళ్లు అద్దె భవనాలలో నెలకొల్పబడ్డాయి. అందువల్ల హరిజనుల సౌకర్యార్థం నడపబడే సాంఘిక సంక్షేమ పాఠశాలలకు సబ్సిడీపొందే హాస్టళ్లకు పక్కా భవనాలను నిర్మించడానికి తలపెట్టబడింది. 1959-60లో 25 పాఠశాలభవనాల నిర్మాణం కోసం రు. 1.00 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో ఒక భవనం రు. 0.06 లక్షవ్యయంతో ఈ జిల్లాలోనిర్మించ బడతాయి.

## పారిశుధ్య సౌకర్యాల ఏర్పాటు

హరిజనవాడలు సామాన్యంగా అపరిశుభ్రంగా ఉంటాయి. ఈ వాడలను ఆరోగ్యకరంగా చేయటానికి బాటలు, మరుగుదొడ్లు, స్నానపుగదులు, మంచినీటి బావులు మొదలయినవాటిని ఏర్పాటుచేయటం అవసరం. ఇందుకుగాను ఆంధ్ర ప్రాంతంలో 217 మంచినీటి బావులను త్రవ్వటానికి 1959-60లో రు. 4.37 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 17 బావులు యీ జిల్లాలో రు. 0.34 లక్ష వ్యయంతో త్రవ్వబడతాయి.

## ఇళ్ల స్థలాల సేకరణ

ఈ పథకంక్రింద ఇళ్ల స్థలాలను సేకరించి వాటినిఉచితంగా హరిజనులకు యివ్వటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 8.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.65 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## ప్రచారం

అస్పృశ్యతను నిర్మూలించటంకోసం దానివల్ల కలిగే అనర్థకాలను గురించి ప్రచారం చేయడానికి, వీటికి సంబంధించి వ్రాయబడిన ఉత్తమమయిన

నాటకాలకు, యక్షగానాలకు బహుమతుల నివ్వటానికి, పత్రికలకు సబ్సిడీలు ఇవ్వటానికి, పోస్టర్లు, కరపత్రాలను ముద్రించటానికి, హరిజన దినోత్సవాలు వర్ణాంతర భోజనాలు ఏర్పాటు చేయుటానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.40 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో యీ పథకాన్ని అమలు పరచటంకోసం రు. 0.035 లక్ష ప్రత్యేకించబడింది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం

హరిజన సేవక సంఘము, భారత సేవక సమాజము, గిల్డ్ ఆఫ్ సర్వీసు రెడ్ క్రాస్ సొసైటీ, రోటరీ క్లబ్బులు మొదలయిన అనేక స్వచ్ఛంద సంస్థలు హరిజనోద్ధరణకు పాటు పడుతున్నాయి. ఈ సంస్థలకు తగు ప్రోత్సాహం యిచ్చేటందుకు ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.60 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలుకూడ యీ సహాయాన్ని పొందవచ్చు.

## గృహనిర్మాణ పథకం

హరిజనులు ఎంత బీదవారంటే వారికి యిళ్ల స్థలాలను ఉచితంగా యిచ్చినప్పటికీ యిళ్లు స్వంతంగా కట్టుకోలేని స్థితిలో వారున్నారు. ఇందువల్ల హరిజనులు యిళ్లు కట్టుకొనేటందుకు వారికి సబ్సిడీలను, ఋణాలను యివ్వటానికి ప్రతిపాదించబడింది. ఒక్కొక్క యింటికి రు. 750లు ధన సహాయం చేయుటానికి ప్రతిపాదించబడింది. ఇందులో రు. 250 లు సబ్సిడీగాను, రు. 500 లు ఋణంగాను ఇవ్వటం జరుగుతుంది. అయితే యీ సౌకర్యం పొందే ప్రతివ్యక్తీ కొంత లేబరుని, సామాగ్రిని సమకూర్చుకొనవలసి ఉంటుంది. వాటివిలువ పై మొత్తంలో చేరదు. హరిజనులతోకలిసి నివసించేటందుకు యితర కులాలవారిని ప్రోత్సహించేనిమిత్తం, నిర్మించటానికి తలపెట్టిన ఇండ్లలో నూటికి 10 యిళ్లు వెనుకబడిన తరగతులవారికి ప్రత్యేకించబడుతున్నాయి. ఈ జిల్లాలో 54 యిళ్లను నిర్మించటంకోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.48 లక్ష కేటాయించబడింది.

# వెనుకబడిన తరగతులు

## వెనుకబడినతరగతుల విద్యార్థులకు స్కాలరుషిప్పులు

వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు స్కాలరుషిప్పులు యివ్వటంకోసం రాజ్యప్రభుత్వంవారు ఏటా రు. 4.00 లక్షలు ఖర్చుచేస్తున్నారు. ఆంధ్ర ప్రాంతంలోని వివిధ పాఠశాలల్లోను, కళాశాలల్లోను చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల విద్యార్థులకు అదనంగా యింకా 920 స్కాలరుషిప్పులు యివ్వటంకోసం ఈ సంవత్సరానికి రు. 2.74 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడినతరగతుల విద్యార్థులకుకూడ యీ స్కాలరుషిప్పులు లభ్యమవుతాయి.

## వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు బోర్డింగు గ్రాంటులు

ఉన్నత పాఠశాలల్లోను, కళాశాలల్లోను చదువుకొంటున్న వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు సబ్సిడైజుడు హాస్టళ్లలో బోర్డింగు గ్రాంట్లు యివ్వబడుతున్నాయి. ఒక్కొక్క విద్యార్థికి విద్యా సంవత్సరానికి రు. 150 లు చొప్పున యీ బోర్డింగు గ్రాంటులు యివ్వబడతాయి. అదనంగా 445 బోర్డింగు గ్రాంటులు మంజూరు చేయటంకోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.67 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకుకూడ యీ బోర్డింగు గ్రాంటులు లభ్యమవుతాయి.

## వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకు మధ్యాహ్న భోజనం

సాంఘిక సంక్షేమ శాఖవారిచే నిర్వహింపబడుతున్న పాఠశాలలలో వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలు చేరటాన్ని ప్రోత్సహించేటందుకు, తద్వారా అస్పృశ్యతా నివారణకు దోహదం చేసేటందుకుగాను రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభించబడినానాటినుండి సాంఘిక సంక్షేమశాఖ పాఠశాలల్లో చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల పిల్లలకు మధ్యాహ్న భోజనం ఏర్పాటు చేయబడింది. ఈ పథకంకోసం 1959—60 లో రు. 0.50

లక్ష ఖర్చు పెట్టటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకుకూడ యిందుమూలంగా లాభం చేకూరుతుంది.

## విముక్త జాతులు

### విద్య

విముక్త జాతులకు చెందిన పిల్లల తలిదండ్రులు తమ పిల్లల విద్యకు కావలసిన సదుపాయాలను కలుగచేసే స్థితిలో లేనందువల్ల యీ పిల్లలు పాఠశాలలకు హాజరు కారు. ఇందువల్లయీ పిల్లలకు పుస్తకాలు, పలకలు మొదలగునవి సరఫరా చేయటానికి, స్కాలరు షిప్పులు మంజూరుచేయడానికి, యింతేకాక చిత్తూరు జిల్లాలో విముక్త జాతులవారికోసం నిర్మించబడిన కాలనీలలో ఏర్పాటు చేయబడిన రెండు పార్కులను, రెండు రేడియో సెట్లను నిర్వహించటానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.09 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని విముక్తజాతులకు చెందిన పిల్లలకుకూడ యీ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

## గృహ నిర్మాణం

విముక్తజాతులవారు తమ నివాస గృహాలను నిర్మించుకోవటానికి యీ పథకంక్రింద సహాయం చేయబడుతుంది. వారు తమ పాకలను క్రొత్తగా నిర్మించుకోదలచినట్లయితే రు. 100 లు విలువచేసే నిర్మాణ సామగ్రి సరఫరా చేయబడుతుంది. ప్రస్తుతమున్న యిళ్లనే వారు మరమ్మతు చేసికోదలచినట్లయితే ప్రతి కుటుంబానికి రు. 30 లు నగదు రూపంలో చెల్లించబడుతుంది. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 40 క్రొత్త యిళ్ల నిర్మాణానికి, 40 పాత యిళ్ల మరమ్మతుకుగాను రు. 0.052 లక్ష కేటాయించబడింది.

## కుటీర పరిశ్రమలు

విముక్తజాతులవారు తమ వృత్తులను కొనసాగించుకోవటంకోసం యీ పథకంక్రింద వారికి సహాయం చేయబడుతుంది. పరికరాలు, పనిముట్లు, ముడిపదార్థాల రూపంలో ప్రతివ్యక్తికి రు. 50ల వరకు యీ సహాయం చేయబడుతుంది. ఇందుకు గాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.15 లక్ష

కేటాయించబడింది. ఇందులో రు. 750/-లు యీ జిల్లాకు ప్రత్యేకించబడి నాయి. ఇందుమూలంగా 15 మందికి లాభం చేకూరుతుంది.

## వైద్య సహాయం

ఈ పథకంక్రింద, విముక్త జాతులకు చెందిన వ్యాధిగ్రస్తులయినట్టి అర్హులైన 50మంది వ్యక్తులకు "డిస్క్రిషనరీ" గ్రాంటులు యివ్వబడతాయి. పై వ్యక్తులు తమకు కావలసిన మందులనుకొనుక్కోవటానికి, యితరఖర్చులకుగాను ఒక్కొక్కరికి రు. 40/-లు చొప్పున యీ గ్రాంటు యివ్వబడుతుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 80 లు యీజిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఈ జిల్లాలో విముక్త జాతులకుచెందిన ఇద్దరికి "డిస్క్రిషనరీ" గ్రాంటులు యివ్వటంకోసం యీ డబ్బు వినియోగించబడుతుంది.

# షెడ్యూల్డు తెగల సంక్షేమం

## పాఠశాలల్లో చదువుకొంటున్న ట్రయిబలు పిల్లలకు పుస్తకాలు, పలకల సరఫరా

ట్రయిబలు ప్రజలు తమపిల్లలను విద్యావంతులుగా చేసేటందుకు ప్రోత్సహించే నిమిత్తం ప్రాథమిక, హైయర్ ఎలిమెంటరీ పాఠశాలల్లో చదువుకొంటున్న ట్రయిబలు పిల్లలకు పుస్తకాలను, పలకలను సరఫరా చేయటానికి సంబంధించిన పథకాన్ని 1959-60లో రు. 0.2434 లక్షవ్యయంతో కొనసాగించటానికి ప్రతిపాదింప బడింది. ఈ పథకంవల్ల 4,057 మందిపిల్లలు లాభం పొందగలరని ఆశించబడుతున్నది.

## ఏజెన్సీ ప్రాంతాల్లో పాఠశాలలు, ప్రాథమిక పాఠశాలలను కొనసాగించటం; క్రొత్తప్రాథమిక పాఠశాలలను స్థాపించటం

ట్రయిబలు పిల్లల సౌకర్యార్థం యీజిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాల్లో యింతకుముందు స్థాపించిన 6 ప్రాథమిక పాఠశాలలను కొనసాగించటానికి,

3 ప్రాథమిక పాఠశాలలను క్రొత్తగా స్థాపించటానికిగాను 1959-60 ప్రణాళికలో రు. 0.17204 లక్ష కేటాయించబడింది.

## ఏజెన్సీ ప్రాంతాలలో పాఠశాలలకు, హాస్టళ్ళకు పక్కాభవనాల నిర్మాణం

ఏజెన్సీ ప్రాంతాల్లోని పాఠశాలలకు పక్కాభవనాలు లేనందువల్ల యీ జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాల్లో 4 పక్కాభవనాలు 1959-60లో నిర్మించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు రు. 0.36 లక్ష యీసంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడింది.

## గుమ్మలక్ష్మీపురంలో మాధ్యమిక పాఠశాలను కొనసాగించటం

శ్రీకాకుళం జిల్లాలోని గుమ్మలక్ష్మీపురంలో ప్రభుత్వమాధ్యమిక పాఠశాలను యీ సంవత్సరంలో కొనసాగించే నిమిత్తం రు. 0.05 లక్ష కేటాయించబడింది.

## గుమ్మలక్ష్మీపురం, దుమ్ముగూడెంలలో ఉన్న మాధ్యమిక పాఠశాలలను ఉన్నతపాఠశాలల స్థాయికి పెంచటం

శ్రీకాకుళం జిల్లా గుమ్మలక్ష్మీపురంలోను, తూర్పుగోదావరిజిల్లా దుమ్ముగూడెంలోను ఉన్న మాధ్యమిక పాఠశాలలను ఉన్నతపాఠశాలల స్థాయికి మార్చటంకోసం రు. 0.05 లక్ష కేటాయించబడింది.

# వ్యవసాయం

## ప్రదర్శన క్షేత్రాలను ప్రారంభించటం

ట్రయిబలు ప్రజలకు మేలురకం వ్యవసాయ విధానాలలో శిక్షణయిచ్చేటందుకు 1957-58లో పైలట్ ప్రదర్శనక్షేత్ర మొకటి యీజిల్లాలోని సీతంపేటలో ఏర్పాటు చేయబడింది. రు. 0.107 లక్ష వ్యయంతోయిది 1959-60లో కొనసాగించబడుతుంది. మేలురకం విత్తనాలు, అంట్లు, పండ్లమొక్కలు మొద.

లైనవి గిరిజనులకు పంపకం చేసేనిమిత్తం యీక్షేత్రంలో ఉత్పత్తి చేయబడతాయి.

## శ్రీకాకుళం జిల్లాలోని సీతంపేట, గుమ్మలక్ష్మీపురాలలో వ్యవసాయ సౌకర్యాలను అభివృద్ధి చేయటం

ఈ పథకం క్రింద ట్రయిబలు తెగల వ్యవసాయదారులకు మేలురకం విత్తనాలు ఎరువులు వాటి అసలుధరలో సగం వెలకు అమ్మబడతాయి. (ఇలా ఒక్కొక్క ట్రయిబలు కుటుంబానికి సరఫరా చేయబడే విత్తనాలు, ఎరువుల ఖరీగు రు. 750/—లకు మించదు) ఇందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 0.20 లక్ష కేటాయించబడింది.

## ఏజెన్సీ ప్రాంతాలలో ప్రదర్శన యూనిట్లను ఏర్పాటుచేయటం

మేలురకం వ్యవసాయ పద్ధతుల్లో ట్రయిబలు ప్రజలకు శిక్షణ యివ్వటం కోసం ఆంధ్రలోని ఏజెన్సీ జిల్లాల్లో 1958-59 నుంచి మొదలు పెట్టి 8 ప్రదర్శన యూనిట్లను పారంభించటానికి ప్రతిపాదింపబడింది. అదే ప్రకారం 1958-59లో విశాఖపట్టణం జిల్లాలోని చింతపల్లిలో ఒక ప్రదర్శన యూనిట్టు ఏర్పాటు చేయబడింది. 1959-60 ప్రణాళికలో రు. 1.55 లక్షల మొత్తం ఆంధ్రలో 7 ప్రదర్శన యూనిట్లను ఏర్పాటు చేయటానికి, యింతకుముందు ప్రారంభించిన క్షేత్రాన్ని కొనసాగించుటకుగాను కేటాయించబడింది. ఇందులో రు 0.197 లక్ష మొత్తం తోనంలో ఒక ప్రదర్శన యూనిట్టును ఏర్పాటు చేయటానికిగాను యీజిల్లాకు కేటాయించబడింది.

## కుటీరపరిశ్రమలు

## శ్రీకాకుళం జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాలలో తోళ్ళు పదునుచేయటానికి సంబంధించిన ప్రదర్శనయూనిట్టు

ఈ పథకంక్రింద, తోళ్ళను పదును చేయటం, పాదరక్షలను తయారుచేయటానికి సంబంధించిన మేలురకం పద్ధతుల్ని గురించి ట్రయిబలు ప్రజలకు

శిక్షణ యివ్వటంకోసం ఏజెన్సీ ప్రాంతాల్లో తోళ్ళ పదును చేయటానికి సంబంధించిన ప్రదర్శన యూనిట్టునొకదాన్ని స్థాపించటానికి ప్రతిపాదింపబడింది. ఆదే ప్రకారం తోళ్ళపదును ప్రదర్శన యూనిట్టొకటి శ్రీకాకుళం జిల్లాలోని తెవ్వొడ్డిలో స్థాపించబడింది. 1957-59 సంవత్సరాల కాలంలో 26 మంది ట్రయిబలు ప్రజలకు యిక్కడ శిక్షణ యివ్వబడింది. ఇంకా 12 మంది ట్రయిబలు అభ్యర్థులకు యీసంవత్సరం రు. 0.054 లక్షవ్యయంతో శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింపబడింది.

## పశుగణాభివృద్ధి

### సంచార పశువైద్యదళాలు, పశువైద్యశాలలు స్థాపించటం

ఏజెన్సీ ప్రదేశాల్లోని పశువులకు వైద్యసహాయం చేయుడానికి, వాటికి వ్యాధులుతగలకుండా నివారణచర్యలు తీసికొనేటందుకుగాను 1957-58 లో యీ జిల్లాలో ఒకసంచార వైద్యదళం, ఒకపశువైద్యశాల స్థాపించబడినాయి. అవసరమయిన సిబ్బందిని నియమించబడింది. కావలసిన మందులు, కుర్చీలు, బల్లలు మొదలయిన కొయ్యసామాను సమకూర్చబడింది. ఈ సిబ్బంది కొనసాగింపుకు, మందులు మొదలయినవాటిని సరఫర చేయుటకుగాను యీ సంవత్సరం రు. 0.0875 లక్ష కేటాయించబడింది.

### పశుప్రథమ చికిత్సాకేంద్రాలు స్థాపించటం

ఈ జిల్లాలో పశుప్రథమ చికిత్సా కేంద్రాన్నొకదాన్ని స్థాపించటంకోసం 1959-60 ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించబడింది.

### పశువులపంపకం

ఆంధ్ర ప్రాంతంలోని ఏజెన్సీ ప్రదేశాల్లో పచ్చికబయళ్ళు కావలసినన్ని ఉన్నాయి. ఈ ప్రాంతాల్లో పెంచేటందుకు పశువులను సరఫరాచేయటానికి సంబంధించిన పథకం మొదటిప్రణాళిక కాలంలో అమలునందుండినది. ఈ ప్రాంతాల్లో పశుగణాభివృద్ధిని కొనసాగించే నిమిత్తం ఒకఆబోతును, ఒక

ఆవును, 10 గొఱ్ఱెలను, 50 కోళ్ళు యీ జిల్లాలో పంపకం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు 1959-60 ప్రణాళికలో రు. 0.0382 లక్ష కేటాయించబడింది.

## శ్రీకాకుళం జిల్లాలో "హ్యాచరీ", కోళ్ళపెంపకం యూనిట్టులను స్థాపించటం

ఏజెన్సీప్రాంతాల్లో కోళ్ళ పెంపకాన్ని ప్రోత్సహించే నిమిత్తం శ్రీకాకుళం జిల్లాలో ఒక "హ్యాచరీ" ని స్థాపించేటందుకు, 1958-59 లో స్థాపించబడిన కోళ్ళ పెంపకం యూనిట్టును కొనసాగించేటందుకుగాను 1959-60 సంవత్సరానికి రు. 0.02 లక్ష కేటాయించబడింది.

## రవాణాసౌకర్యాలు (రోడ్లు)

ఏజెన్సీ ప్రాంతాల్లో రవాణాసౌకర్యాలను అభివృద్ధి చేసేనిమిత్తం క్రింది పనులనిర్వహణకుగాను 1959-60 ప్రణాళికలో రు. 0.50 లక్ష కేటాయించబడింది.

| వరుససంఖ్య | పనిపేరు | 1959-60 లో కేటాయించబడినమొత్తం (రూపాయయి, లక్షలో) |
|---|---|---|
| 1. | కురుపంనుండి ములగేడుకు రోడ్డు నిర్మించటం — | 0.50 |

## ఏజెన్సీ గ్రామాలలో చిన్నగ్రామీణ రోడ్లను నిర్మించటం; ప్రస్తుతమున్నరోడ్లకు మరమ్మతులు

ఈ జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాల్లో చిన్నగ్రామీణ రోడ్లనునిర్మించటానికి, ప్రస్తుతమున్న చిన్నరోడ్లకు మరమ్మతులు చేయటానికగాను, 1959-60 ప్రణాళికలో రు. 0.12 లక్ష కేటాయించబడింది.

## ఏజెన్సీ ప్రాంతాల్లో మత్స్య పరిశ్రమాభివృద్ధి

ట్రయిబలు ప్రజలుమత్స్య పరిశ్రమను శాస్త్రీయపద్ధతుల్లో చేపట్టుటను ప్రోత్సహించటానికి, వారికి యీ విషయాలను గురించి శిక్షణయిచ్చేటందుకు గాను యీ జిల్లాలో చేపపిల్లలపెంపకానికి, మత్స్య పరిశ్రమాభివృద్ధికి 1959-60లో రు. 0.015 లక్ష కేటాయించబడింది.

## ఏజెన్సీ ప్రాంతాల్లో రేడియోసెట్ల స్థాపన

ఏజెన్సీ గ్రామాల్లో 8 రేడియో సెట్లు నెలకొల్ప టానికి, ఇంతకు ముందే నెలకొల్ప బడిన 14 రేడియో సెట్లను నిర్వహించుటకు గాను యీ జిల్లాకు 1959—60 సంవత్సరానికి రు. 0.039లక్ష కేటయించ బడింది.

## స్త్రీసంక్షేమం

## ఏజెన్సీ ప్రాంతాల్లో స్త్రీసంక్షేమ శాఖలను ఏర్పాటు చేయటం

ట్రయిబలు స్త్రీలకు ఆరోగ్యకరమైన, పరిశుభ్రమైన పద్ధతుల్లో నివసించ టాన్నిగూర్చి బోధించే టందుకు, యింతేకాక వారికి తమకుటుంబాలను పొదుపు గా ఎలాసాగించాలి అన్నవిషయాన్ని గురించి, తమ తీరికకాలాన్ని ఎలా సద్వినియోగం చేసికోవాలి అన్నవిషయాన్ని గురించి వివరించటానికి గాను మొదటి ప్రణాళికా కాలంలో ఆరు స్త్రీసంక్షేమ కేంద్రాలు నెలకొల్పబడినాయి. రెండవ ప్రణాళికాకాలంలో ఇంకా 3 కేంద్రాలు 1956—59లలో నెలకొల్ప బడినాయి. ఈ సంవత్సరం యింకా 3 కేంద్రాలను నెలకొల్పటానికి ప్రతి పాదింప బడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.58లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.187లక్ష యీ జిల్లాలో ఒ కేంద్రాన్ని కొత్తగాస్థాపించ టానికి, యింతకు ముందుస్థాపించిన కేంద్రాన్ని కొనసాగించటానికి గాను ప్రత్యేకించ బడింది.

## ఫీల్డుసిబ్బందికి పునశ్చరణ తరగతులు

ప్రభుత్వం వారిచే నిర్వహింప బడుతున్న వివిధ పథకాలు, అభివృద్ధి కార్యక్రమాల్ని గురించి స్త్రీసంక్షేమ శాఖయొక్క ఫీల్డుసిబ్బంది తమపరిజ్ఞా

నాన్ని ఎక్కువచేసి కొనేటందుకు గాను యీ పథకం క్రింద ఏజెన్సీ ప్రాంతాల్లో పునశ్చరణ తరగతులు నిర్వహించ బడతాయి. ఈ సంవత్సరం 5 మందికి శిక్షణయివ్వటం కోసం రు. 0.005లక్ష కేటాయించ బడింది.

## రోగులు, అవిటివారు మొదలైనవారికి సహాయం

కాయకష్టం చేయలేనట్టి ట్రయిబలు స్త్రీరోగులకు సహాయం చేయటానికి, అవిటివారికి పునరావాసం కల్పించేటందుకు గాను యీ పథకం ఉద్దేశించ బడింది. ఇందుకుగాను యీజిల్లాకు యీ సంవత్సరం రు 0.025లక్ష కేటాయించ బడింది. 13 మంది స్త్రీలకు యీ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

## వైద్యం

### విశాఖపట్టణం జిల్లాలో వైద్యాధికారులచే పర్యటన

ఏజెన్సీ గ్రామాల్లోని ప్రజలకు వైద్య సహాయం చేయటం కోసం పెద్దవలస, సీతంపేటలలో ఉన్న ప్రముఖ వైద్యాలయాల వైద్యాధికారి మెటర్నటీ అసిస్టెంటుతో కలసి పదుంరోజుల కొకసారి శ్రీకాకుళం, విశాఖపట్టణంజిల్లాల్లోని ఏజెన్సీగ్రామాల్లో పర్యటిస్తారు. 1957—58లో యీ పథకం ప్రారంభించ బడింది. ఈసంవత్సరం కూడ కొనసాగించ బడుతుంది. ఇందుకు రు. 0.012లక్ష కేటాయించ బడింది.

### తోనంలో వైద్యశాల ప్రారంభించటం

శ్రీకాకుళం జిల్లాలోని తోనంలో ఒకవైద్యశాల 1957—58లో, యీ ప్రాంతంలో ట్రయిబలు ప్రజలకు యింకా ఎక్కువవైద్య సౌకర్యాలను కలిగించటంకోసం, ప్రారంభించబడింది. రు. 0.20లక్ష ఖర్చుతో యీ సంవత్సరంలో కూడ యీ వైద్యశాలను కొనసాగించటానికి ప్రతిపాదింప బడింది.

### సీతంపేటలో సంచార వైద్యదళం

ఏజెన్సీ ప్రాంతాల్లోని, ట్రయిబలు ప్రజలకువైద్య సహాయం అందచేయటం కోసం సీతంపేటలో 1958—59లో ప్రారంభించ బడిన సంచారవైద్య దళం రు. 0.67లక్ష ఖర్చుతో యీ సంవత్సరం కూడ కొనసాగించ బడుతుంది.

## సీతంపేటలో వైద్యాలయ భవననిర్మాణం
## సిబ్బందికి వసతిగృహాల నిర్మాణం

ప్రస్తుతం సీతంపేటలోని వైద్యాలయం పాకలో నెలకొల్పబడిఉన్నది. ఇందువల్లయీ వైద్యాలయానికి పక్కాభవనాన్ని, సిబ్బందికి వసతిగృహాలను నిర్మించటం 1958—59లో ప్రారంభించ బడింది. ఈభవనాల నిర్మాణంపూర్తి చేయటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 0.16లక్ష కేటాయించ బడింది.

## భద్రగిరిలో ఆసుపత్రిని ఏర్పాటు చేయటం

ఈపథకం క్రింద ఏజెన్సీ ప్రాంతాల్లోని ప్రజలవైద్యావసరాలను ఆదుకొనేటందుకు గాను భద్రగిరి(ఎల్విన్‌పేట)లో ఒక ఆసుపత్రిని ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు ప్రణాళికలో రు. 0.28లక్ష కేటాయించ బడింది.

## ప్రజారోగ్యం
## ఏజెన్సీ ప్రాంతాలలో మలేరియా వ్యాధినివారణ కార్యక్రమం

ఆంధ్రలోని ఏజెన్సీప్రాంతాల్లో మలేరియావ్యాధి ఎక్కువగా ప్రబలిఉన్నది. మలేరియావ్యాధి నివారణచర్యలు మొదటి ప్రణాళికా కాలంలో ప్రారంభించ బడినాయి. రెండవ ప్రణాళికా కాలంలో కూడకొనసాగించ బడుతున్నాయి. ఈ సంవత్సరం రు. 5.00లక్షల మొత్తం ఆంధ్రలోని యితర ఏజెన్సీ ప్రాంతాలకు కూడ యీ చర్యల్ని విస్తరింపచేసే నిమిత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.62లక్ష యీజిల్లాకు ప్రత్యేకించ బడింది.

## ఏజెన్సీ ప్రాంతాలలోప్రసూతి, శిశుఆరోగ్య కేంద్రాలు

శిశుమరణాలను అరికట్టేటందుకుగాను 1957-59 సంవత్సరాల్లో 3 ప్రసూతి, శిశుఆరోగ్య కేంద్రాలు ఏర్పాటుచేయబడినాయి. ఈ సంవత్సరం

యింకా ఒక కేంద్రాన్ని స్థాపించటానికి ప్రతిపాదింపబడింది. పాతకేంద్రాల్ని కొనసాగించటానికి, క్రొత్త కేంద్రాన్ని స్థాపించటానికిగాను 1959-60 ప్రణాళికలో రు. 0.73 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.15 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## ఏజెన్సీ ప్రాంతాలలో బావుల త్రవ్వకం

ఏజెన్సీ ప్రాంతాలలో పరిశుభ్రమైన మంచినీటి సరఫరా సౌకర్యాలు లేనందువల్ల, ట్రయిబల్ ప్రజలు వాగులనుండి, కుంటలనుండి లభ్యమయ్యే నీటిని వాడుకొంటున్నారు. ఈ నీరు ఆరోగ్యానికి చాలహానికరం. ట్రయిబలు ప్రజలకు పరిశుభ్రమైన మంచినీటి సౌకర్యాన్ని కలిగించేనిమిత్తం రు. 0.51 లక్షవ్యయంతో యీ జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాలలో 12 బావులను త్రవ్వటానికి ప్రతిపాదింపబడింది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం

ఆంధ్రలోని ఏజెన్సీ ప్రాంతాలలో సంక్షేమ కార్యక్రమాల్ని అమలు జరుపుతున్న స్వచ్ఛందసంస్థలకు ఆర్థికసహాయం చేయటానికిగాను 1959-60 సంవత్సరానికి రు. 0.40 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛందసంస్థలకు కూడ యీ పథకంక్రింద సహాయం లభిస్తుంది.

# స్త్రీ సంక్షేమం

## వృత్తి విద్యా శిక్షణ కేంద్రాలు

విద్యావంతులయికూడ నిరుద్యోగులుగానున్న తక్కువ ఆదాయం వచ్చే తరగతి కుటుంబాలకు చెందిన బాలికలకు సహాయం చేయటంకోసం 1958-59 సంవత్సరంలో యీ జిల్లాలోని శ్రీకాకుళంలో వృత్తి విద్యా శిక్షణ కేంద్రం ఒకటి ఏర్పాటు చేయబడింది. ఇందులో టైపురైటింగు, షార్టుహ్యాండు, బుక్-కీపింగు, అకౌంటెన్సీ, సెక్రటేరియల్ కోర్సులలో శిక్షణ యివ్వబడుతుంది. ఈ కేంద్రాన్ని కొనసాగించటానికి, 30 మంది అభ్యర్థులను చేర్చుకోవటానికి-

అభ్యర్థులు చేరటానికివచ్చేపక్షంలో యింకా ఎక్కువమందిని చేర్చుకోవటానికి గాను 1959—60 సంవత్సరానికి రు. 0·160 లక్షకేటాయించ బడింది:

### ప్రస్తుతమున్న స్త్రీ సంక్షేమ శాఖ విభాగాల అభివృద్ధి

స్త్రీ సంక్షేమ శాఖ కార్యక్రమాలను తీవ్రతరం చేయటానికి, అవి మరింత ప్రయోజనకరంగా ఉండేటట్లు చేయటానికిగాను దృశ్యశ్రవణ పరికరాలు, సౌండు ప్రొజెక్టర్లు, విద్యా బోధన పటాలు, కెమేరాలు, రేడియోలు, సైకిళ్లు, కుట్టు మిషనులు మొదలయినటువంటి పరికరాలను, ఇతర ముఖ్య సామగ్రిని ఆంధ్రలో ప్రస్తుతమున్న 12 స్త్రీసంక్షేమ శాఖ విభాగాలకు రు. 0.10 లక్ష వ్యయంతో 1959—60 లో సరఫరాచేయుటానికి ప్రతిపాదింపబడింది. ఇందులోరు. 300 లు యీ జిల్లాకు కేటాయించబడినాయి

## సాంఘిక సంక్షేమం

### సాంఘిక సంక్షేమ విస్తరణ కేంద్రాలు

ప్రస్తుతమున్న 2 సంక్షేమ విస్తరణ కేంద్రాలను, కో-ఆర్డినేటెడ్ ప్యాటర్న్ సంక్షేమవిస్తరణ కేంద్రాల్ని నిర్వహించటానికి, ఈ జిల్లా లోని మొదటి దశ బ్లాకుల్లో అదనంగా ఒక కో-ఆర్డినేటెడ్ ప్యాటర్న్ పద్ధతిని మరొక ప్రాజెక్టును ప్రారంభించడానికి రాజ్య ప్రభుత్వావారు క్రింద ప్రణాళికలో ఈసంవత్సరం రు· 0.386 లక్ష మొత్తం కేటాయించ బడింది. వీటికి అయ్యే ఖర్చును బ్లాకులు, కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు, రాజ్యప్రభుత్వం 5:12:6 నిష్పత్తి లో భరిస్తాయి. ప్రజలనుండి సేకరించబడే మాచింగు విరాళాలు కూడ ఇందుకు తోడవుతాయి.

### సాంఘిక, నైతిక పునరుద్ధరణ, సంరక్షణ కార్యక్రమాలు

నైతిక పునరుద్ధరణ కేంద్రాలనుండి విడుదల చేయబడిన స్త్రీలకోసం రాజ్యస్థాయిలో ఒకసదనాన్ని, 14 జిల్లా ఆశ్రయ కేంద్రాలను (3 పురుషులకు, 11 స్త్రీలకు) ప్రారంభించడానికి, ఇంతేకాక రాజ్యంలో యిదివరకే నెలకొల్ప బడిన రాజ్యస్థాయి సదనాలను, జిల్లా ఆశ్రయ కేంద్రాలను కొనసాగించేందుకు

ఆయ్యేఖర్చులో రాజ్య ప్రభుత్వం వాటా క్రింద 1959-60 ప్రణాళికలో రు. 6.32 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందు రు. 0.153 లో లక్ష యీజిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ జిల్లాలో స్త్రీలకోసం నెలకొల్పబడిన ఒక జిల్లా ఆశ్రయ కేంద్రం కొనసాగింపుపై ఖర్చు వినియోగించ బడుతుంది.

# మునిసిపలు రోడ్లు, అభివృద్ధి పనులు

మునిసిపాలిటీల, రెండుపట్టణ పంచాయతీలయొక్క ఆదాయమార్గాలను అభివృద్ధిపరచే ఉద్దేశంతోను, స్థానిక ప్రజలకు మరికొన్ని సౌకర్యాలను కలగ చేసే ఉద్దేశంతోను రెండవ ప్రణాళికలో రు. 47.54లక్షలమొత్తం కేటాయించ బడింది. దీర్ఘకాలిక ఋణాల రూపంలో ఆర్థిక సహాయం కలుగచేయడానికి ఈ మొత్తం వినియోగించ బడుతుంది. ఇందులో రు. 21.42 లక్షలు మొదటి మూడుసంవత్సరాలలో ఖర్చుచేయబడ్డాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 11.59 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రు. 0.15 లక్ష మొత్తం 1958—59లో టౌను ప్లాను డైరెక్టరు కార్యాలయంలో నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించడానికి వినియోగించ బడుతుంది. మిగిలిన రు. 11.44లక్షలలోను, రు. 0.10 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఋణం మొత్తం, స్థానికసంస్థ పేరు, పని వివరం ఈ దిగువ తెలుప బడ్డాయి.

| స్థానికసంస్థ పేరు | పని వివరము | అప్పు మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| శ్రీకాకుళం పురపాలకసంఘం | మార్కెటుకు అభివృద్ధి పనులు | 0.10 |

# రేడియో ప్రసారం

## కమ్యూనిటీ రేడియోసెట్ల స్థాపన, నిర్వహణ

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో 420 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో 212 సెట్లు మాత్రం

1956—59 సంవత్సరాల కాలంలో యీ జిల్లాలో నెలకొల్పబడినాయి. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 100 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పటానికి, 1-4-1959 తేదీకి పూర్వం నెలకొల్పబడిన అన్ని సెట్లనూ నిర్వహించడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.312 లక్ష మొత్తం కేటాయించబడింది.

# ప్రచారం

రెండవ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా అమలుపరచటం కోసం ప్రణాళికను గురించి ప్రజలలో శ్రద్ధాసక్తులు కలిగేటట్లు చేసేటందుకు, వారి సంపూర్ణసహకారాన్ని పొందేటందుకు, వారు యీ కార్యక్రమంలో ఎక్కువగా పాల్గొనేటట్లు చేసేటందుకుగాను వివిధ ప్రచార సాధనాల ద్వారా అభివృద్ధి కార్యక్రమాలనుగురించి ప్రచారంచేయటం కోసం 1956—57 లో ఏకీకృత కార్యక్రమం ఒకటి ప్రారంభించ బడింది. ఈ కార్యక్రమాన్ని కొనసాగించటానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6.80 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 43,917 లు యీ జిల్లాలో క్రిందివిధంగా వినియోగించ బడతాయి.

| | | రూపాయలు |
|---|---|---|
| 1. | పర్సనల్ అసిస్టెంట్లు, యితర సిబ్బందికి జీతాలు .... | 5,987 |
| 2. | సంచార ప్రచార వ్యానులకు పెట్రోలు, యితర ఖర్చులకు... ... | 1,200 |
| 3. | జిల్లా స్థాయిలో ఏర్పాటు చేయబడే ప్రదర్శనలో పాల్గొనేటందుకు ... | 250 |
| 4. | సంగీత నాటకోత్సవాలు ఏర్పాటుచేయడానికి | 500 |
| 5. | జిల్లా, తాలూకా కేంద్రాలలో ప్రణాళికా వార్షికోత్సవాలు ఏర్పాటు చేయటానికి ... | 900 |

6. జిల్లాలో పనిచేస్తున్న బుర్రకథ దళాల నిర్వహణకు. .... 2,280

7. సంచార వ్యానులకు పరికరాలు ... 32,800

మొత్తం 43,917

## అర్థగణాంకశాఖ

1959—60 లో యీ జిల్లాలో ఒక జిల్లా గణాంకశాఖ ఏర్పాటు చేయబడుతుంది. ఒక జిల్లా గణాంకాధికారి (గెజిటెడ్), ఒక ఎకనామిక్ ఇన్వెస్టిగేటరు, ఒక అప్పరు డివిజనుగుమాస్తా, ఇద్దరు జవానులు యిందులో నియమించబడతారు. జిల్లాస్థాయిలో రాజ్యం యొక్క గణాంక సేకరణ కార్యక్రమాలను సమన్వయ పరచటానికి, సేకరించబడి సంకలనం చేయబడే గణాంక వివరాలలో లోపాలులేకుండా ఉండేటట్లు చేయటానికి "లయజన్ ఏజెన్సీ"గా జిల్లా గణాంక విభాగం పనిచేస్తుంది. ఇందుకోసం 1959—60 ప్రణాళికలో రు. 0.10 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది.

## తంతి తపాలా సౌకర్యాలు

1959—60 లో 32 తపాలా ఆఫీసులను ప్రారంభించటానికి, యింతేకాక మూడు (సంయుక్త) తంతి కార్యాలయాలను సీతంపేట, గుమ్మలక్ష్మీపురం, గారలలో ప్రారంభించటానికి ప్రతిపాదింపబడింది. నౌపాడ, సోంపేటలలో మూడు టెలిఫోను ఎక్స్ఛేంజీలను, పాలకొండలో ఒక పబ్లిక్ కాల్ ప్రారంభించటానికికూడ ప్రతిపాదింపబడింది.

## రైలు మార్గాలు

శ్రీకాకుళం జిల్లాలో రైలు మార్గాలకు సంబంధించి 1959—60 లో క్రింది కార్యక్రమం అమలు జరుప బడుతుంది.

వరుస సంఖ్య — పనివివరము

## ఇచ్ఛాపురం—వాల్తేరు సెక్షను

1. ఇచ్ఛాపురంలో విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని విస్తరింప చేయటం, నాలుగు సీట్ల సెప్టిక్ ట్యాంకు మరుగు దొడ్లను ఏర్పాటు చేయటం.

2. ఝాదుపూడులో ప్రయాణీకుల ప్లాటుఫారంను విస్తరింప చేయటం, చుట్టూరా తీగ కంచె వేయటం.

3 సోంపేటలో గూడ్సుషెడ్డుసౌకర్యాలను కలిగించటం; వాటరుషెల్టరును ఏర్పాటు చేయటం.

4. బారువలో తీగకంచె వేయటం; వాటరు షెల్టరు ఏర్పాటు చేయటం.

5. పలాసలో నీటిసరఫరాను అధికం చేయటం; రెండు టవరు లైట్లను ఏర్పాటు చేయటం; ఇనస్పెక్టింగు సిబ్బందికి రెస్టుహౌస్ నిర్మాణం; ప్లాటుఫారం మీద, అప్రోచ్ రోడ్డుమీద అదనంగా లైట్లను ఏర్పాటు చేయటం;

6. పూండిలో 4అం. వ్యాసం ఉండే గొట్టపు బావి ఏర్పాటు చేయటం;

7, రౌతుపురంలో వెయిటింగు హాలు నిర్మాణం;

8. నౌపడలో మూడవ రిసెప్షెన్ లైను నిర్మించటం; నీటిసౌకర్యం కలిగించటం; రెండవ తరగతి వైద్యాలయం ఏర్పాటు చేయటం; కొత్తసహకార స్టోరు భవన నిర్మాణం; ప్లాటుఫారం మీద అదనంగా లైటింగు సౌకర్యాల ఏర్పాటు; అప్రోచ్ రోడ్డు నిర్మాణం.

9. దండుగోపాలపురంలో వెయిటింగు హాలు నిర్మాణం ;

10. కోటబొమ్మాలిలో క్రొత్త పార్సెల్ మరియు గూడ్సు గిడ్డంగి నిర్మాణం:

11. ఉర్లాంలో ప్లాటుఫారంకు గచ్చు చేయటం;

12. శ్రీకాకుళం రోడ్డు స్టేషన్‌లో మూడవ రిసెప్షన్ లైను, జి.ఆర్.పి. ఔటుపోస్టు. జి. ఆర్. పి. ముఖ్యసిబ్బందికిగాను ఒకయూనిట్టు రెండవ తరగతి, నాలుగు యూనిట్లు ఒకటవ తరగతి ఇళ్ళ నిర్మాణం.

13. దుసిలో పార్సెళ్ళను నిలువచేయుటకు గాను పనికిరాని రెండు వాగను బాడీలను నెలకొల్పటం.

14. పుందూరు స్టేషనులో కంబైండు గూడ్సుషెడ్డు, పార్సెల్ గిడ్డంగి నిర్మాణం; స్టేషనులోను, గూడ్సు షెడ్డులోను విద్యుచ్ఛక్తి దీపాలను సమకూర్చటం: ప్లాటుఫారం మీద మూడు సీట్ల సెప్టిక్ ట్యాంకు లెట్రిన్ ఏర్పాటు చేయటం.

15. సిగడంలో మూడవ రిసెప్షను లైను నిర్మించడం, ప్లాటుఫారంకు గచ్చు చేయటం.

16. గరివిడిలో మూడవ రిసెప్షను లైనును ఏర్పాటు చేయటం; ప్రస్తుత మున్న తూనిక యంత్రాన్ని మార్చి 40 టన్నుల క్రొత్తతూనిక యంత్రాన్ని నెలకొల్పడం.

17. నెల్లిమర్లలో మూడవ రిసెప్షను లైనును ఏర్పాటు చేయటం: స్టేషను చుట్టు పొట్టిగోడపై తీగ కంచెను వేయడం; ప్లాటుఫారం మీద నీటి కొళాయి ఏర్పాటు చేయడం.

18 పార్వతీపురంలో గూడ్సు షెడ్డు సౌకర్యాలు కలిగించటం విద్యుతీకరణాన్ని విస్తృత పరచటం; ప్లాటుఫారం మీద రెండు సీట్ల సెప్టిక్ ట్యాంకు లెట్రిన్‌ను ఏర్పాటు చేయడం

19. సీతానగరంలో మూడవ రిసెప్షెను లైనును ఏర్పాటు చేయటం; మంచి నీటి సౌకర్యాలను కలిగించటం.

20. బొబ్బిలిలో గూడ్సుషెడ్డు సౌకర్యాలను కలిగించడం; వెయిటింగు హాలుచుట్టూరా జాఫరీతో పొట్టిగోడ నిర్మించడం; వెయిటింగు హాలును విస్తృత పరచడం; గూడ్సుషెడ్డు దగ్గర కొళాయి, నీటి సౌకర్యాలు

కలిగించడం; డ్రెయినులను సమకూర్చడం; లోడింగ్ ప్లాటుఫారంను విస్తృత పరచడం; జి. ఆర్. పి. ఔట్ పోస్టును ఏర్పాటు చేయడం. జి. ఆర్. పి. ముఖ్యసిబ్బందికి రెండు యూనిట్ల మొదటి తరగతి ఇళ్ళ నిర్మాణం; ప్లాటుఫారం మీద నీటి సౌకర్యాలు, లైటింగు సౌకర్యాలు కలిగించడం; అప్రోచ్ రోడ్డు నిర్మాణం.

21. డొంకిన వలసలో మూడవ తరగతి వెయిటింగు హాలును 500 చదరపు అడుగులకు విస్తృత పరచటం: నీటి సౌకర్యాలు కలిగించడం; నాలుగు దీప స్తంభాలను నెలకొల్పటం, (ఒకటి వెయిటింగు హాలు వద్ద, ఒకటి బుకింగ్ ఆఫీసువద్ద).

22. కోమటిపల్లిలో వాటరు షెల్టరు నెలకొల్పటం.

23. గజపతినగరం వెయిటింగు హాలును విస్తృత పరచటం.
సిగడం—చీపురుపల్లి మధ్య క్రాసింగ్ స్టేషను నెలకొల్పటం.
పలాస—పూండి మధ్య క్రాసింగ్ స్టేషను నెలకొల్పటం.
కోట బొమ్మాలి-తిలారు మధ్య క్రాసింగ్ స్టేషను నెలకొల్పటం.

## శ్రీకాకుళం జిల్లా ప్రణాళిక, అభివృద్ధిసంఘం సభ్యుల జాబితా

జిల్లాకలెక్టరు — అధ్యక్షుడు
జిల్లాప్లానింగు ఆఫీసరు — కార్యదర్శి

1. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, పి.డబ్ల్యు. డి. శ్రీకాకుళం
2. జిల్లా వ్యవసాయశాఖాధికారి, శ్రీకాకుళం
3. అదనపు జిల్లా వ్యవసాయశాఖాధికారి, శ్రీకాకుళం
4. సహకార సంఘాల డిప్యూటి రిజిస్ట్రారు, శ్రీకాకుళం
5. సహకార సంఘాల డిప్యూటి రిజిస్ట్రారు, పార్వతీపురం
6. జిల్లా వైద్యశాఖాధికారి, శ్రీకాకుళం

7. జిల్లా పశువైద్యశాఖాధికారి, శ్రీకాకుళం
8. జిల్లా విద్యాశాఖాధికారి, శ్రీకాకుళం
9. ప్రత్యేక జిల్లా విద్యాశాఖాధికారి, శ్రీకాకుళం
10. జిల్లా విద్యాశాఖాధికారి, విజయనగరం
11. డివిజనల్ ఇంజనీరు (విద్యుచ్ఛక్తి) శ్రీకాకుళం
12. జిల్లా పంచాయతి ఆఫీసరు, శ్రీకాకుళం
13. డివిజనల్ ఇంజనీరు(హైవేస్) శ్రీకాకుళం
14. వాణిజ్య, పరిశ్రమలశాఖ అసిస్టెంటుడైరెక్టరు, శ్రీకాకుళం
15. జిల్లా సంక్షేమశాఖాధికారి, శ్రీకాకుళం
16. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, స్పెషల్ ఇన్వెస్టిగేషన్ డివిజన్, విజయనగరం
17. పోలీసు సూపరింటెండెంటు, విజయనగరం
18. జిల్లా అటవీశాఖాధికారి, విజయనగరం
19. జిల్లా ఆర్గనైజరు, జాతీయ పొదుపుపథకం, శ్రీకాకుళం
20. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, నారాయణపురం ప్రాజెక్టు
21. ఫిషరీస్ అసిస్టెంటు డైరెక్టరు, విశాఖపట్టణం
22. అసిస్టెంటు రేడియోఇంజనీరు, విశాఖపట్టణం
23. అసిస్టెంటుఇంజనీరు, స్థానికాభివృద్ధిపనులు, శ్రీకాకుళం
24. అసిస్టెంటు ఉమన్ వెల్ఫేర్ ఆఫీసరు, శ్రీకాకుళం
25. అసిస్టెంటుకలెక్టరు, టెక్కలి
26. సబ్కలెక్టరు, పార్వతీపురం
27. రెవిన్యూడివిజన్ ఆఫీసరు, శ్రీకాకుళం
28. శ్రీకాకుళం జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసరుయొక్క పర్సనల్ అసిస్టెంటు

29. బ్లాకుడెవలప్‌మెంట్ ఆఫీసరు, గారబ్లాకు
30. ,, ఇచ్ఛాపురం
31. ,, ఆముదాలవలస
32. ,, పాలకొండ
33. ,, సోంపేట
34. ,, మందస
35. ,, నరసన్నపేట
36. ,, సర్వకోట
37. ,, కోటబొమ్మాళి
38. ,, సీతంపేట
39. ,, భద్రగిరి
40. ,, షేర్‌మహమ్మద్‌పురం
41. ,, మురపాక
42. ,, రామభద్రాపురం
43. ,, బొబ్బిలి
44. ,, సరిబుజ్జలి
45. శ్రీకాకుళం సహకార సెంట్రల్‌బ్యాంకు స్పెషల్‌ఆఫీసరు
46. విజయనగరం సహకార సెంట్రల్‌బ్యాంకు అధ్యక్షుడు
47. అసిస్టెంటు అగ్రికల్చరల్ ఇంజనీరు (ఇనస్పెక్షన్) విశాఖపట్టణం
48. ప్రత్యేక జిల్లావిద్యాశాఖాధికారి (ఏజెన్సీ) కాకి ‌ డ
49. ఏజెన్సీ వ్యవసాయశాఖాధికారి, కాకినాడ
50. జిల్లా ఆరోగ్యశాఖాధికారి, శ్రీకాకుళం
51. సహకార సంఘాల ప్రత్యేకడిప్యూటీ రిజిస్ట్రారు, అముదాలవలస
52. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు (బిల్డింగ్ విశాఖపట్టణం)

## అనధికారసభ్యులు

1. శ్రీ రాజగోపాలరావు, ఎం.పి., అముదాలవలస
2. శ్రీ బి. సత్యనారాయణరావు, ఎం.పి., రాజాపురం
3. శ్రీ డి. సూరిదొర, ఎం.పి., సరికి
4. శ్రీ సి. హెచ్. పరశురామనాయుడు, ఎం.ఎల్ సి., పార్వతీపురం
5. శ్రీ బి. కూర్మన్న, ఎం.ఎల్.సి., టెక్కలి
6. శ్రీ టి రాఘవదాస్, ఎం.ఎల్.సి., సిద్ధాంతం
7. శ్రీ పి సూర్యనారాయణ, ఎం.ఎల్.ఎ., శ్రీకాకుళం
8. శ్రీ టి. పాపారావు, ఎం.ఎల్.ఎ., తొగరం
9. శ్రీ ఎం. సత్యనారాయణరాజు, ఎం.ఎల్.ఎ., మెరకముడిదం
10. శ్రీ కె. పున్నయ్య, ఎం.ఎల్.ఎ., శ్రీకాకుళం
11. శ్రీ పి. యన్. అప్పారావు, ఎం.ఎల్.ఎ., పాలకొండ
12. శ్రీ సి. హెచ్. శ్రీరంగనాయకులు, ఎం.ఎల్.ఎ., రాజాం
13. శ్రీ సి. హెచ్. సత్యనారాయణ, ఎం.ఎల్.ఎ., షెర్ మహమ్మద్ పురం
14. శ్రీ ఎ. లక్ష్మనాయుడు, ఎం.ఎల్.ఎ., తాడికొండ
15. శ్రీ వి. చంద్రచూడమణిదేవ్, ఎం.ఎల్.ఎ., కురుపం
16. శ్రీ కె. సీతారామస్వామి, ఎం.ఎల్.ఎ., బొబ్బిలి
17. శ్రీ పి. రామస్వామి, ఎం.ఎల్.ఎ., రివిటి
18. శ్రీ బి రాజయ్య, ఎం.ఎల్.ఎ., సాలూరు
19. శ్రీ ఎ. ఎరుకునాయుడు, ఎం.ఎల్.ఎ., సాలూరు
20. శ్రీ యస్ జగన్నాథం, ఎం.ఎల్.ఎ., శ్రీకాకుళం
21. శ్రీ పి. గున్నయ్య, ఎం.ఎల్.ఎ., చినబొండపల్లి
22. శ్రీ ఎల్. లక్ష్మణదాసు, ఎం.ఎల్.ఎ., పాతపట్నం

23. శ్రీ ఎన్. రాములు, ఎం.ఎల్ ఎ., పలాస
24. శ్రీ ఆర్. ఎల్. నరసింహం, ఎం.ఎస్.ఎ., శ్రీకాకుళం
25. శ్రీ జి. లచ్చన్న, ఎం.ఎల్.ఎ., బారువ
26. శ్రీ వి. రంగబాబు, ఎం.ఎల్.ఎ., ఇచ్ఛాపురం
27. శ్రీ పి. మోహనరావు, జగతి
28. శ్రీ ఎ. అప్పారావు, సొరుబిజ్జ
29. శ్రీ టి. సత్యనారాయణ, అధ్యక్షుడు, పంచాయతిసమితి, గార
30. శ్రీ వై. కుప్పేశ్వరరావు, పాలకొండ
31. శ్రీ జి. ఎల్. నాయుడు, రామచంద్రపల్లి
32. శ్రీ ఎస్. శ్రీనివాస రెడ్డి, రామచంద్రపల్లి
33. శ్రీ మహమ్మద్ సముద్దీన్ సాహెబ్, ఇచ్ఛాపురం
34. శ్రీ కె. నరసయ్య, బారువ
35. శ్రీ జి. రాజారావు, గుటువిల్లి
36. శ్రీ ఆర్. రామమూర్తి, కురుడు
37. శ్రీ ఎం. చంద్రశేఖరరావు, చల్లవాని పేట
38. శ్రీ వి. జగన్నాథం, కడుము
39. శ్రీ ఎం. స్వామినాయుడు, పదంగి
40. శ్రీ టి. ఎస్. గుప్త, నరసన్నపేట
41. శ్రీ హెచ్. హరికృష్ణచౌదరి, బ్రాహ్మణతర్ల
42. శ్రీ సి. హెచ్. అచ్యుతరావు, బొబ్బిలి
43. శ్రీ బి. ఎం. రెడ్డి, టెక్కలి
44. శ్రీ జి. భోగయ్య, బారువ
45. శ్రీ సి. హెచ్. నరసింహం, శ్రీకాకుళం
46. శ్రీ ఎ. గంగయ్య, ఛైర్మెన్, బొబ్బిలి
47. శ్రీమతి మజీద్ హాషిమ్ ఆలిఖాన్, స్త్రీల ప్రతినిధి

